శ్రీరస్తు

# విజయనగర రాజుల కథలు



ఇది

## శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిచే

విరచితము


రాయవరముసంపతి

## హరి అండు కంపెనీవారిచేఁ

ప్రకటితము

మొదటి కూర్పు

రాయవరము

శ్రీ మేరీ ముద్రాక్షరశాలయందు ముద్రితము

౧౯౧౭




వెల ౦—౩—౦

# విన్నపము

మహాశయులారా!

బాలుర హృదయములు నిర్మలము లగుటచేఁ దొలుత వారిచే నేమి చదివించిన నదియే యా పవిత్ర మనఃఫలకములపై చిత్రితమై తుదవఱకు నట్లే యుండును. కావుననే నీతిపాఠములు చెప్పవలయు నని పెద్దలు చెప్పెదరు. మనకు నీతిపాఠము లెంత యావశ్యకములో నడవడుల ఫలములను సోదాహరణముగఁ జూపు చరిత్రపాఠములు నంత యావశ్యకములే. నిజముగా బాలురకుఁ జెప్పుట కాంధ్రభాషలో సులభశైలిని చరిత్రపాఠములు లేనేలేవు. మే మా కొఱఁతఁ దీర్చుటకై ప్రకృతము,

విజయనగరరాజులకథలు

చిత్తూరురాజులకథలు

దిల్లీచక్రవర్తులకథలు

గోల్కొండనవాబులకథలు

ఓరుగంటిరాజులకథలు

అను నైదు పుస్తకములను ప్రకటించుచున్నాము. వీనియందలి మంచిచెడ్డలను గ్రహించి తమ బాలురచే వీనినిఁ జదివించి మేలొందవలయు నని మే మాంధ్ర మహాజనులను ప్రార్థించుచున్నాము.

రాయవరము
౧—౫—౧౩

మల్లిడి త్తిరెడ్డి
శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

# విజయనగరము

ఈ మహానగరము తుంగభద్రానదీతీరమున ప్రస్తుతపు బళ్లారిజిల్లా యందలి హాస్పేటవద్ద నుండెను. ఇది యనుభవించినంత వైభవము మఱి యే నగరమును అనుభవింప లేదని చెప్పవచ్చును. ఇది క్రీస్తుశకము ౧౩౩౬ వ సంవత్సరమున నిర్మింపఁబడి ౧౫౬౫ వ సంవత్సరమున నాశనము చేయఁబడెను; గాని యిప్పటికి నక్కడ రాజమందిరములు, దేవాలయములు మున్నగు నవి గలవు. ఇది ఆంధ్రులకు కాశీక్షేత్రము వంటిది.

# మంత్రోపదేశము

పూజ సేయుము సర్వేశు; భూమిపతినిఁ
గొలువు; మన్నింపు తల్లిదండ్రులను; దోటి
వారి కాదరమును జూపు; పాటిసేయు
మా మహాత్ములఁ; బిన్నలఁ బ్రేమఁ గనుమా;
ధనము గూర్పుము ధర్మపథమ్మునందు;
అనుభవింపుము దివ్యసౌఖ్యమ్ము లెల్ల;
ఆయము నెఱింగి సేయుము వ్యయము; తోడఁ
బుట్టువుల, నాలుబిడ్డలఁ బ్రోవు మెపుడు.
కల్ల లాడకు; సేయకు కాని పనులు;
జేలపోవకు; కోరకు పెఱల కలిమి
దేశకాలపాత్రమ్ములు తెలిసి నడువు;
మెల్లవారు నుతింప నూతేంప్లు మనుము.
భయము విడువుము; దైన్యమ్ము పాలఁబడకు
మాపదలయందు; జాతిమర్యాద నిలుపు;
కవులఁ బూజించి చిరకీర్తి గడనసేయు;
మభిలషింపుము స్వీయదేశాభివృద్ధి.

విజయనగరమును అచ్చటఁ గట్టించెను. ఆ పట్టణము పదుక్రోసుల పొడవును, అయిదుక్రోసుల వెడల్పును డెబ్బది చదరపుక్రోసుల వైశాల్యమును గలిగి ఉండెను.

---

## బుక్కరాయఁడు

---

హరిహరరాయనికి కంపభూపతి, బుక్కరాయఁడు, మారప్ప, ముద్దప్ప అను నలుగురు తమ్ములు గలరు. వారిలో బుక్కరాయఁడు చాల తెలివితేటలును, బల పరాక్రమములును గలవాఁడు అగుటవలనను మొదటి నుండియు రాజ్యమును సంపాదించుటయందును, ఏలు టయందును, శత్రువులను ఓడించి పాఱఁదోలుటయం దును, విజయనగరమును గట్టించుటయందును అన్న యగు హరిహరునకు చాల చేదోడువాదోడుగా నుండు టచేతను హరిహరుని తరువాత రాజు అయ్యెను. ఆతని కంటె పెద్దవాఁడు అగు కంపభూపతి ఏదో ఒక మండల మును మాత్రము ఏలుచుండెను.

బుక్కరాయఁడు చాల శూరుఁడు, విద్వాంసుఁడు.

ఈతఁడు సాయణుఁడు మాధవుఁడు అను గొప్ప పండి తులచే వేదములకు భాష్యములు అనఁగా గొప్ప వ్యా ఖ్యానములు వ్రాయించి కృతి పొందెను. బుక్కరా యఁడు రాజ్యమునకు వచ్చిన కొలఁది దినములయందే తుంగభద్రానదికి దక్షిణమున ఉన్న రాజ్యము అంతయు ఆక్రమించెను తూర్పున కళింగదేశమును ఓఢ్ర దేశ మును గూడ జయించెను. ఈతఁడు తన దేశమునందలి ప్రజలను కన్న కుమారులను వలె రక్షించెను. ప్రజలు ఈతనిని దేవుఁడని తలంచి పూజించిరి. ఈతఁడు మల్లినాథుఁడు, బచ్చరాజు, మాధవమంత్రి, మున్నగు సేనాధిపతుల సాయంబున చాల తడవలు తురకలను ఓడించెను. పాండ్యదేశపు రాజు మున్నగు వారిని గూడ జయించెను.

మలబారు, సింహళము మున్నగు ప్రదేశములను ఏలు రాజులు తమ రాయబారులచే ఈతనికి ఏటేట పెక్కు కానుకలు పంపుచుండిరి. బుక్కరాయఁడు విజయనగరమున లెక్కలేని గొప్పమందిరములను గట్టించెను. ఆ పట్టణమును సాటిలేని గొప్ప వర్తకలము

గాఁ గూడ చేసెను. చెఱువులు, కాల్వలు, నూతులు త్రవ్వించి ఈతఁడు వ్యవసాయమునకు చాల వీలు గలిగించెను. తన క్రింది అధికారులు ప్రజలను ఎన్నఁడును బాధింపకుండ ఈ రాజు చాల మెలఁకువతో చూచుచుండెను.

---

## రెండవ హరిహరరాయఁడు

బుక్కరాయని భార్య గౌరాంబిక. ఆమెయందు బుక్కరాయనికి హరిహరరాయఁడు అను కుమారుఁడు కలిగెను. తండ్రితరువాత ఈ రెండవ హరిహరుఁడు రాజ్యమునకు వచ్చెను. ఈతఁడును తండ్రివలె గొప్ప విద్వాంసుఁడు; శూరుఁడు; మహాదాత; ఈతఁడు అంతకు పూర్వము తన తండ్రి తాత మున్నగు వారు తాల్చిన "మండలేశ్వర, ఒడయర్" మొదలగు చిన్నరాజులకు తగిన బిరుదములను విడిచిపెట్టి "మహారాజాధిరాజ, రాజపరమేశ్వర" మున్నగు చక్రవర్తులకు తగిన గొప్పబిరుదములను ధరించెను.

ఈతనివద్ద తండ్రికాలమునుండియు ఉన్న సాయణుఁడు, మాధవమంత్రి అను మంత్రులు గాక ముద్దప్ప, గుండప్ప, అను గొప్ప మంత్రులు గూడ నుండిరి. ఈ మంత్రులందఱును చాల పరాక్రమము గలవారు. వారి తెలివితేటలకు మితి లేదు. వీరి సాహాయ్యంబున హరిహరరాయఁడు అనేకశత్రువులను చాల సులభముగ జయించెను. చాల దేశమును, ధనమును సంపాదించెను. ఈ రెండవ హరిహరరాయఁడు చాల సదృష్టవంతుఁడు. సంగీతము, సాహిత్యము మున్నగు విద్యలయందు ఈతఁడు కడు నిపుణుఁడు. ప్రజ లీతనిని తండ్రివలె ప్రేమించుచుండిరి. ఈతఁడు తుర్కీవాండ్రను పూర్తిగా నోడించెను. ప్రజల సుఖమే తన సుఖమని యెంచికొనిన ఈ రాజు చాలమంది సామంతరాజులకు సార్వభౌముఁడై చాల వైభవముతో ఇరువదియెనిమిదియేండ్లు రాజ్యమేలెను.

---

## మొదటి దేవరాయఁడు

రెండవ హరిహరరాయనికి మల్లాంబిక అను రాణి

యందు బుక్కరాయఁడు, విరూపాక్షరాయఁడు, చిక్క రాయఁడు, అను ముగ్గురు కుమారులు కలిగిరి. ఈ రెండవ బుక్కరాయనికే మొదటి దేవరాయఁడు అని మాఱుపేరు గలదు. ఈ రాజు గోవా, దాభోళు, తూర్పు సముద్రప్రాంతమును జయించెను. పట్టణములో అనేక ప్రాకారములను, బురుజులను గట్టించెను. ఈతఁడు సింహాసన మెక్కునప్పటికి విజయనగరమున మంచినీటి సౌకర్యము లేక ప్రజలు చాల చిక్కు పడు చుండిరి. ఉన్ననీరు పరిశుభ్రమైనది కాకపోవుటచే తోఁటలు మున్నగు వ్యవసాయములు చక్కఁగా ఫలిం పకుండెను. ఆ హేతువుచే నీతఁడు విజయనగరమునకు పైని ఆఱుక్రోసుల దూరమున తుంగభద్రానదికి ఆన కట్ట గట్టి పట్టణములోని కొక కాలువను తీసికొని వచ్చెను. ఆ యానకట్ట కట్టుటకై ఈ రాజు ఒక పెద్ద రాతిగుండును వందలకొలఁది యేనుఁగులచే దొర్లించు కొనిపోయి నది కడ్డముగా వేయించెను.

ఈ యానకట్ట కట్టుటకు బొక్కసములోని ధనమంత యు నైపోయెను; గాని దానివలన మామూలు వచ్చు

బడి కంటె పంద్రెండు లక్షల రూపాయీల ఆదాయము పెరిగెను. పట్టణములోనికి తెచ్చిన ఆ కాలువనీటిచే నగరము చుట్టును అనేకములగు ద్రాక్షతోటలు, తమలపాకుతోటలు, ఉద్యానవనములు మున్నగు నవి చక్కగా బెరిగి నగరమునకు చాల శోభ కలిగించెను. ఈకాలువ యిప్పటికిని గలదు. దాని నిర్మాణపై పుణ్యమును జూచి ఇప్పటి శాస్త్రజ్ఞులు చాల నాశ్చర్యపడుచున్నారు.

ఈ మొదటి దేవరాయఁడు ఈ యొక్క కాలువయే గాక దేశమున వ్యవసాయ మెక్కువయై ప్రజలు సుఖపడుటకును, భాగ్య మధిక మగుటకును ఇంకను చాల కాలువలను త్రవ్వించెను. ఆంధ్ర, గీర్వాణ, కర్ణాట భాషలను చాల నభివృద్ధిచేసెను. అనేకకవులను పోషించెను. ఈతనివద్ద సిద్దన్నమంత్రియు, అతని తండ్రియగు జన్నయమంత్రియు నుండిరి. ఈ రాజునకు హరిహరుఁడు, విజయుఁడు, మల్లన్న అను ముగ్గురు పుత్రులుండిరి. వారిలో విజయుఁడను నతఁడు తండ్రి బ్రతికియున్నపుడు యువరాజుగా నుండి పిదప రాజయ్యెను.

గాని ఒక సంవత్సరము మాత్రమే యాతఁడు జీవించెను.

## రెండవ దేవరాయఁడు

విజయునకు దేవరాయఁడు, పర్వతరాయఁడు అను నిద్దఱు కుమారులును, హరమ్మ యను కూఁతురు నుండెను. తండ్రి యనంతరము దేవరాయఁడు రాజయ్యెను. ఈతనికి "ఇమ్మడి దేవరాయఁ" డనియు, ఏనుఁగులను వేటాడుటలో చాల నేర్పరి యగుటచే "గజబెంటె దేవరాయఁ" డనియు రెండు మాఱు పేళ్లుండెను.

ఈ రాజు సెలవుచొప్పున నీతని మంత్రులు హరిహరుఁడు కట్టించిన హరిద్ర యను ఆనకట్టను మఱల గట్టి చేయించిరి. ఈతఁడు వ్యవసాయదారులకు లెక్కలేని సాకరములు గలిగించెను. ప్రజలను కన్నబిడ్డలవలె నాదరించెను. కనోజ కాంభోజ నేపాళ దేశపు రాజు లీతనిని సేవించుచుండిరి. క్విలన్, సిలోన్, పిలికట్, పేగు, టెనెసెరిం, మొదలయిన యనేకదేశపు రాజు లీతనికి సామంతులై కప్పము

గట్టించుచుండిరి. ఈతఁడు బ్రతికియున్నంత కాలము లెక్కలేని యుద్ధములు చేసి శత్రువులను గడగడలాడించెను. ఈతని శత్రువులలో ననేకులు చాల గొప్పవారుండిరి. ఆ కారణమున నీతనివద్ద నెప్పుడును నాలుగు లక్షలకు తక్కువ కాకుండ వీరాధివీరు లగు సైనికులుండిరి. ఒక్కొక్కప్పు డీతఁడు సేనను ఏడు లక్షల వఱకు వృద్ధి చేయుచుండెను. బ్రతికి యున్నంతవఱకు యుద్ధములే చేయవలసివచ్చినను, లక్షలకొలఁది సైనికులను జీతము లిచ్చి పోషించుచుండవలసివచ్చినను, ప్రజల సుఖము నిమిత్తము రాశులకొలఁది రొక్కము వెచ్చింపవలసివచ్చినను, ఇంకను అనేకధర్మకార్యములు చేయుచును ఈతఁడు రెండువందల యిరువది యైదు కోట్ల రూపాయిల కంటె నెక్కుడు నిలువ చేసెను. ఇఁక రత్నములకును, రాణివాసముస్త్రీల నగలకును ఇంత వెల యని చెప్పుటకే వీలుగాకుండెను. ఈతఁడు చాల వైభవము ననుభవించెను.

పారసీకదేశపు చక్రవర్తియగు షాహరుఖ్ అను నాతఁడీరాజువద్దకు అబ్దుర్ రజాక్ అను వానిని తన రాయబా

ర్తిగా నంపెను. ఇంకను విదేశీయరాజు లనేకు లీతని చక్ర
వర్తిగా నంగీకరించి సేవించుచుండిరి. ఈ రాజు కాల
ములో విజయనగరసామ్రాజ్యము చాల వైభవము
ననుభవించెను.

---

## మల్లిఖార్జునరాయఁడు

---

ఈతఁడు రెండవ దేవరాయనికి సింహాలదేవి యను
రాణియందు కలిగెను. ఈ రాజు వద్ద తిమ్మనదండనా
యకుఁడు మంత్రిగా నుండెను. ఈతఁడు గోకర్ణక్షేత్ర
మునందలి మతగురువులను చాల భయభక్తులతో
ప్రార్థించుచు వారికి గొప్ప దానము లనేకములు చేసె
ను. ఈతఁడు యుద్ధములేమియు లేకుండ శాంతముగా
నిరువది సంవత్సరములు రాజ్యము చేసెను.

---

## విరూపాక్షరాయఁడు

---

ఈతఁడు మల్లిఖార్జునరాయని తమ్ముఁడు. అన్న

తరువాత సీతఁడు రాజయ్యెను; గాని రాజలక్షణము లేవి యు సీతనియందు లేవయ్యెను. పేరునకు మాత్రము రాజుగా నీతఁ డెప్పుడు నంతఃపురము విడిచి కొలు వుకూటమున సింహాసనము మీఁదఁ గూర్చుండి యెఱుఁ గఁడు. ఎల్లప్పుడును రాణివాసమున స్త్రీలతో విహ రించుచు కాలము గడుపసాగెను. ప్రజ లెప్పుడు సీతనిం జూచి యెఱుఁగరు. రాజుగారినిఁ జూడవలె నని వా రెంతో ముచ్చటపడుచుండిరి; గాని వారి యాశలు ఫలింప వయ్యెను. తుదకు మంత్రులకును, దండనాథు లకును గూడ రాజుగారు కాన్పించుట కష్ట మయ్యెను. ఆ కారణమువలనఁ బ్రజలు రాజుగారిని లెక్కసేయ రైరి. మూర్ఖుఁ డగుటచే మంచిచెడ్డలు తెలియక యీతఁడు పెక్కండ్రు దండనాథులను జంపించెను. ఈ సంగతులు తెలిసికొని తుర్కీవాండ్రు ఈతని కోటలను కొన్నిటి నాక్రమించుకొనిరి; గాని వాండ్ర సీతఁ డేమి యుఁ జేయలేకపోయెను.

పడమటి సముద్రపుటొడ్డుననున్న గోవాపట్టణమున నుండు తుర్కీవాండ్రు అరబ్బీపారసీకదేశపు గుఱ్ఱము

లను దెచ్చి బహామనీసులతానులకును, విజయనగరరాజులకును అమ్ముచుండిరి. ఇట్లు జరుగుచుండఁగా నత్తురకలు బహామనీసుల్తానుల ప్రోత్సాహమువలన విరూపాక్షరాయనికి గుఱ్ఱముల నమ్ముట మానివైచిరి. అందులకుఁ గోపించి విరూపాక్షరాయఁడు తన సేనాధిపతినిఁ బంపి గోవాపట్టణమునందలి పదివేల తుర్కవాండ్రను జంపించెను. అంత బహామనీసుల్తానుల మంత్రి యగు ఖాంజాఖాన్‌గవాను వచ్చి పోరాడి మరల గోవాపట్టణమును స్వాధీనము చేసికొనియెను.

ఈ విరూపాక్షరాయనికి రాజశేఖరరాయఁడు, విరూపాక్షరాయఁడు నను కుమారు లిద్దఱుండిరి. రాజశేఖరరాయఁడు తండ్రినిఁ జంపించి రాజయ్యెను. అందులకు అంగీకరింపక ఆతని తమ్ముఁడగు విరూపాక్షరాయఁ డన్నను జంపించి తాను రాజయ్యెను. అన్నగారినిఁ జంపించిన యీ రెండవ విరూపాక్షరాయని పాలనమును ప్రజలు అంగీకరింపరైరి. అప్పుడు ఆతని వద్ద సాళువ నరసింహరాజు దండనాథుఁడుగా నుండెను. ప్రజలందఱును ప్రోత్సాహము చేయుటచే నీ సాళువ

నరసింహరాజు రెండవ విరూపాక్షరాయనిని వెడలఁగొట్టి తాను రాజయ్యెను. ఇంతటితో విజయనగర రాజుల ప్రథమవంశ మంతరించెను.

---

## సాళువ నరసింహరాజు

---

ఈతఁడు రెండవ హరిహరరాయనివద్ద దండనాయకుఁడుగను, మంత్రిగను ఉండిన గుండప్ప రెండవ కొడుకు. ఈతనికి తిమ్మరాజు అను అన్న యుండెను. ఈ నరసింహరాజు రాజుకాకపూర్వ మనేకయుద్ధములు చేసి ఆఱితేఱి యుండెను. అంతేగాక విజయనగరరాజ్యపు తూర్పుభాగమున కంతకు నధిపతియై ప్రజల మెప్పు సంపాదించుకొనియెను. ఆ హేతువుచే విరూపాక్షరాయనిని వెడలఁగొట్టి రాజ్య మాక్రమించుకొనుటలో ప్రజలీతనికి ప్రోత్సాహము గలిగించిరి. ఈ నరసింహరాజు తక్కిన దండనాథులకు లంచము లిచ్చి వారిని వశపఱచుకొనియెను. రెండవ విరూపాక్షరాయఁడు జరుగుచున్న కుట్ర యేమియు నెఱుఁగడు. నర

సింహరాజు కోటనాక్రమించుకొని రాయనినిఁ బట్టుకొ మ్మని యొకదండనాయకుని బంపెను. ఈ వార్త యొక భటుఁడు చెప్పఁగా రాయఁ డా భటునే చంపించెను. పిదప తన్ను బట్టుకొనుటకై నరసింహరాజు పంపిన దండనాయకుఁడు వచ్చుచున్నాఁ డని యెఱింగి రెండవ విరూపాక్షరాయఁడు కన్నులు తెఱచి చూచి ద్విత్రో వను బాఱిపోయెను.

సాళువ నరసింహరాజు చాలపరాక్రమవంతుఁ డగుటచే విజయనగరరాజ్యమునుండి తురుష్కులాక్రమించుకొనిన కోట లన్నిటిని మఱల స్వాధీనము చేసికొనెను; గాని ఉదయగిరి, రాయచూరు, కొండవీడు, అను మూఁడు దుర్గములను జయింపఁ దలంచుచుండఁగా నాతనికి మరణకాలము సమీపించెను. ఆ దుర్గములను మూఁడింటిని స్వాధీనము చేసికోవలసిన దని యీతఁడు మంత్రి కాజ్ఞాపించెను.

ఈ నరసింహరాజు తన గుఱ్ఱపుబలము నభివృద్ధి చేయుటకై అరబ్బీదేశమునుండియు, పారశీకదేశము నుండియు మంచి గుఱ్ఱముల ననేకములు తెప్పించు

చుండెను. గుఱ్ఱములు తీసికొనివచ్చుటలో మా మధ్య మున్ గొన్ని చచ్చిపోయినను వాని తోఁకలు తెచ్చిన చో సీతఁడు వర్తకులకు వాని వెల యిచ్చివేయుచుండె ను. మొత్తము మీఁద చచ్చిన వైనను బ్రతికిన వై నను మూఁడు గుఱ్ఱములకు వేయి వరహాల చొప్పున సీతఁడు వెల యిచ్చుచుండెను. అక్కటన వర్తకులు మంచి గుఱ్ఱములను తెచ్చుచుండిరి. ఈతని గుఱ్ఱపు సేనను జూచి శత్రువులు గడగడలాడుచుండిరి.

ఈ నరసింహరాజు అనేకపండితులను ఆదరించెను. ఈతని యాస్థానమున పిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁ డనుకవి యాస్థానకవిగా నుండి జైమినిభారతము తెలుఁగులో వ్రాసి యీతనికి కృతి యిచ్చెను. ఈతని యొద్ద నాదెళ్ళ చిట్టిగంగన్న అను నియోగి మంత్రిగా నుండెను.

సాళువ నరసింహరాజు చనిపోవునప్పటి కీతని కుమారులు పిల్లలుగా నుండిరి. ఆ కారణమువలన నర సింహరాజు మరణసమయమున తన సేనాధిపతి యగు తుళువ నరసరాయనినిఁ బిలిపించి యాతనికి తన యిరు వురు కుమారులను, బొక్కసమును, సేనను అప్పగించి

తన కొడుకులు పెద్ద లయిన పిదప వారిలో తెలివిగల వానికి రాజ్య మిమ్మని చెప్పి చనిపోయెను.

తుళువ నరసరాయఁడు సాళువ నరసింహరాజు సెలవుచొప్పున ఆతని పెద్దకుమారుఁ డగు నరసరాజును సింహాసన మెక్కించి యాతని పేర రాజ్యము చేయఁ దొడఁగెను; గాని యా చిన్నిరాజు నెవరో చంపివైచిరి. పిదప రెండవ బాలుఁడు రాజయ్యెను. తుదకు తుళువ నరసరాయఁ డా బాలునిఁ జంపి తాను విజయనగరసామ్రాజ్యమునకు చక్రవర్తి యయ్యెను.

---

## తుళువ నరసరాయఁడు



ఈ తుళువ నరసరాయఁడు సాళువ నరసింహరాజునకు అన్న మనుమఁడు. సాళువ నరసింహరాజునకు తిమ్మరాజను అన్నయుండెను. ఆతనికి ఈశ్వరరాజను పుత్త్రుఁడు గలిగెను. తుళువ నరసరాయఁడు ఆ యీశ్వరరాజు పుత్త్రుఁడు. నరసరాయఁడు శూరుఁడును, రసికుఁడు నగుటవలన ప్రజ లీతని యెడల చాల భయ

భక్తులు గలిగి యుండిరి. ఇతఁడనేక దేశములను జయించెను. ఈతని యాస్థానమున నందిమల్లయ్య, ఘంట సింగయ్య అను ఇద్దఱు కవు లాస్థానకవులుగా నుండిరి. వీరిరువురును వరాహపురాణ మను చక్కని గ్రంథమును వ్రాసి నరసరాయనికి కృతి యిచ్చిరి.

ఈతనికి తిప్పాజీ, నాగలాంబిక, ఓబాంబిక, అను ముగ్గురు భార్య లుండిరి. వారిలో నరసరాయనికి తిప్పాజీయందు వీరనరసింహరాయఁడు, నాగలాంబికయందు కృష్ణదేవరాయఁడు, ఓబాంబికయందు అచ్యుతరాయఁడు సదాశివరాయఁడు నలుగురు కుమారులు గలిగిరి. నరసరాయఁడు చనిపోయిన పిదప నాతని పెద్ద కొడుకగు వీరనరసింహరాయఁడు రాజయ్యెను; గాని కొలఁది కాలమునందే యాతఁడు చనిపోయెను. పిదప నాతని కుమారుని కైదుచేసి కృష్ణదేవరాయఁడు రాజయ్యెను.

---

## కృష్ణదేవరాయఁడు



కృష్ణరాయఁడు బాల్యమునుండియు చాల బలపరాక్రమములు చూపసాగెను. అన్న యగు వీరనరసింహారాయఁడు రాజ్య మేలునపు డీతఁ డొకటిరెండు యుద్ధములలో పోరి గెలిచెను. మరణకాలమునకు వీరనరసింహారాయనికి తిమ్మరాజు అను ఎనిమిదేండ్ల కుమారుఁడుండెను. తాను చనిపోయిన తరువాత కృష్ణరాయఁడు తన కుమారుని వెడలఁగొట్టి రాజ్య మాక్రమించుకొను నేమో యని సందేహించి వీరనరసింహారాయఁడు మంత్రి యగు తిమ్మరుసును బిలిచి కృష్ణరాయని కనులు పీకించి తనకుఁ జూపవలెనని చెప్పెను.

అపుడు తి రుసు మాఱుపలుకక వల్లె యని కృష్ణరాయని మ రణ్యమునకు తీసికొనిపోయి జరిగిన వృత్తాంత మంతయు నాతనితోఁ జెప్పెను. అది విని కృష్ణరాయఁడు "నా యన్నకు అట్టి సందేహ మున్నది గావున నీ వేమియు సందేహింపక నా గ్రుడ్లు పీకించుకొనిపోయి మా యన్నకుఁ జూపు" మని చెప్పెను.

తిమ్మరుసు కృష్ణరాయని ధైర్యమునకును, సాహసమునకును, అన్న యెడల గల గౌరవమునకు అబ్బుర పడి “ఓయీ! నీవు పొరపడుచున్నావు. ఇది యిట్లు జరుగఁ దగదు. ఎంతో భయభక్తులతో సేవించుచున్నను నీ యన్నకు నీకు ద్రోహము చేయఁ దలంపు గలిగినది. ఏ కట్టెకు నిప్పు ఉండిన ఆ కట్టె భస్మమై పోవును. అట్లే ఎవనికి ద్రోహచింత గలిగిన వాఁడు చెడిపోవలెను. అపకారికి ఉపకారము చేయుట నీతి గాదు. నీ యన్న నీకుఁ జేయనెంచిన ద్రోహమును నీవు నీయన్నకు చేయుము. ఈ విజయనగరసామ్రాజ్య లక్ష్మి నీ కొఱకు ఎదురు చూచుచున్నది. నీ యన్న కొడుకు తిమ్మరాజు నిస్తేజుఁడు” అని చెప్పి కృష్ణరాయనికి రాజ్యాశ పుట్టించి ఆతని నొక రహస్యమందిరమున దాచి మేఁకకనులు పీకించి వీరనరసింహరాయనికిఁ జూపెను. ఆ కన్నులు కృష్ణరాయని వనియే తలంచి వీరనరసింహరాయఁ డానదముతో ప్రాణములు విడిచెను.

పిదప పట్టాభిషేకసమయమున తిమ్మరుసు తెలు

ష్ఠగా తన యెడల భక్తివిశ్వాసములు గల అనుచరులను వెంటఁబెట్టుకొని వచ్చి వీరనరసింహరాయని భార్యను, కుమారుఁ డగు తిమ్మరాజును, తన తమ్ముఁ డైనను తిమ్మరాజు పక్షమున నుండుటవలన అచ్యుతదేవరాయని కైదు చేసి చంద్రగిరికోటకుఁ బంపించి వేసి కృష్ణరాయఁడు మహావైభవముతో విజయనగర సింహాసన మెక్కెను.

తిమ్మరుసు నియోగిబ్రాహ్మణుఁడు ఆతని యింటి పేరు సాళువ వారు; తండ్రి రాచయ్య; భార్య లచ్చమ్మ. ఈతఁడు చిన్నతనమున కడు బీదవాఁడై కొన్ని దినములు పశువులను గాచెను. పిదప గుత్తి, చంద్రగిరి, పెనుగొండ మొదలయిన పట్టణములలో మాధుకరవృత్తిచే వసనము చేసి చదువుకొని అక్కడి దుర్గాధీశ్వరులను ఆశ్రయించి తన తెలివి తేటలచే క్రమక్రమముగా వృద్ధి జెంది కడకు విజయనగరసామ్రాజ్యమునకు పెద్ద మంత్రి అయ్యెను. మొదట నీతఁడు కృష్ణరాయని తండ్రివద్ద మంత్రిగా ప్రవేశించెను. వీరనరసింహరాయనికిఁ గూడ నీతఁడే

మంత్రి యయ్యెను. తుదకు కృష్ణరాయనికి గూడఁ నీతఁడే మంత్రి యయ్యెను. కృష్ణరాయని మీఁద నీతనికిఁ గల ప్రేమకు హద్దు లేదు. కృష్ణరాయని కీతఁడు చేసిన సాహాయ్యమునకు మేఱ లేదు. కావుననే కృష్ణరాయఁడు తిమ్మరుసును అప్పాజీ (నాయనగారూ) ని పిలుచుచుండెను.

సింహాసన మెక్కిన పిదప రెండుసంవత్సరములవఱకును కృష్ణరాయఁడు విజయనగరమున సైన్యము మున్నగు వానిని గుఱించి చక్కని యేర్పాట్లు గావించెను. అది యంతయు ముగిసిన తరువాత నాఁడొక శుభముహూర్తమున దక్షిణదేశమునందలి శత్రువులను జయించుటకు బయలుదేఱెను

కర్ణాటకదేశములో కావేరీనది యొడ్డున దిట్టమైన శివసముద్రమను కోట యొకటి కలదు. దానిని ఏలు రాజు లందఱును విజయనగరరాజులకు సామంతులుగా నుండిరి; గాని కృష్ణరాయని కాలమున ఆ కోటను ఏలు గంగరాజు తిరుగఁబడి కప్ప మిచ్చుట మానివైచెను. ఆ హేతువువలన కృష్ణరాయఁడు పెద్ద

పెద్ద ఫిరంగులతోడను, గొప్ప ఫౌజుతోడను వానిని జయించుటకు బయలువెడలెను. శ్రీరంగపట్టణమున కేలిక యగు చిక్కరాయనికిని గంగరాజునకును విరోధము గలదు; కావున కృష్ణరాయఁడు చిక్కరాయని వెంటఁబెట్టుకొనిపోయి యుద్ధముచేసి శివసముద్రమను కోటను బట్టుకొనియెను. గంగరాజు కావేరిలోఁ బడి ప్రాణములువిడిచెను. పిదప ఉమ్మటూరు జయించెను. చిక్కరాయని శాశ్వతముగా వశపఱచికొని యాతఁ డీయవలసిన కప్పమును నిర్ణయించుకొనియెను. మైసూరుదేశమును కర్ణాటకదేశమును స్వాధీనమయ్యెను. కర్ణాటకదేశమునకు శ్రీరంగపట్టణము రాజధానిగా నేర్పఱచి అక్కడ చిక్కరాయని తన ప్రతినిధిగా నిలిపెను. ఆ ప్రాంతముల నున్న పాళెములను జయించి కాంబగౌడఁడు; వీరప్పగౌడఁడు అను పాలెగాండ్ర వశమున నుంచెను.

పిదప కొడగు, మళయాళ దేశములను జయించెను. పాండ్యదేశము మున్నగు దక్షిణదేశములను జయించుటకు విజయప్పనాయకుఁడు, వేంకటప్పనాయకుఁడు,

అను వారిని బంపెను. అక్కడ వారు చెప్పినంత పని యే జేసిరి. ఇట్లు వశమైన దక్షిణదేశము నంతను మూడు భాగములుగా భాగించి కృష్ణప్పనాయకుడు, విజయరాఘవనాయకుడు, వెంకటప్పనాయకుడు, అను ముగ్గురు నాయకులను వానిపై నధికారులుగా ఏర్పాటు చేసెను.

తరువాత కృష్ణరాయడు తూర్పుదేశమును జయించుటకు బయలుదేరి తొలుత నెల్లూరిమండలమునందలి ఉదయగిరిదుర్గము స్వాధీనము చేసికొనియెను. ఈ దుర్గము తొలుత విజయనగరరాజులదే గాని యిటీవల దానిని గజపతులను ఓఢ్ర రాజులు జయించిరి. కృష్ణరాయడీ కోటను గొట్టుట కెనిమిదివేల యేనుగులను, ముప్పదివేల కాల్బలమును వెంటబెట్టుకొని పోయెను. ఇది యైన పిమ్మట గుంటూరుమండలము నందలి కొండవీడు జయింప మొదలెను. ఇది తొలుత రెడ్డిరాజులు గట్టిరి; గాని వారి నోడించి గజపతులు దానిని వశపఱుచుకొనిరి. ఈ కొండవీడు పట్టుటకు కృష్ణదేవరాయడు తిమ్మరుసును గూడ

బెట్టుకొని వెళ్లెను.

కృష్ణరాయఁడు కొండవీడు ముట్టడింప బయలుదేఱె నని విని కటకమునకు రాజైన ప్రతాపరుద్రదేవుఁడు పదుమూఁడువందల యేనుఁగులును, ఇరువదివేల గుఱ్ఱములును, అయిదులక్షల కాల్బలమును గల సేనతో బయలుదేరి కృష్ణానదివద్దకు వచ్చెను; గాని కృష్ణరాయఁడు వెంటనే అతిచాతుర్యముతో కృష్ణానది దాఁటి వెళ్ళి ప్రతాపరుద్రదేవుని పాఱఁద్రోలి యాతని గుఱ్ఱములను, ఏనుఁగులను లెక్కలేనన్నిటిని, విశేషధనమును కొల్లకొట్టెను పిదప తిమ్మరుసు రెండుమాసములు పోరి కొండవీడుకోట జయించెను. కృష్ణరాయఁడు కొండవీడుదుర్గమునకు ఏలికయు, ప్రతాపరుద్రదేవుని కుమారుఁడు నగు వీరభద్రగజపతిని చెఱ పెట్టి విడిచిపెట్టెను. పిమ్మట రాయఁడు కొండవీడు సమీపమున నున్న బెల్లముకొండ, నాగార్జునకొండ, అద్దంకి, అమ్మనబ్రోలు, తంగేడు, కేతవరము మొదలగు కోటలను గొట్టెను.

ఈ దండయాత్రలో కృష్ణరాయని భార్యలు గూడ

వెంటనుండిరి. వారును రాయఁడును గలిసి అమరావతి పట్టణములోని అమరేశ్వరునకును, బెజవాడలోని శివుని దేవాలయమునకును మఱి యనేక దేవాలయములకును పెక్కు దానములు చేసిరి. రాయఁడు బెజవాడలో కొన్ని దినము లుండి కృష్ణయొడ్డున నున్న శ్రీకాకుళ మను పుణ్యక్షేత్రమును జూడఁబోయి అచ్చటనే ఆము క్తమాల్యద అను గొప్ప కావ్యమును వ్రాయ నిశ్చ యించుకొనియెను.

రాయఁడు కొండవీటినుండి కొండపల్లి యను దు ర్గమునకుఁ బోయి దానిని రెండునెలలు ముట్టడించి జయిం చెను. మఱియు నందున్న కటకాధిపతి భార్యను, పుత్రుని, ఏడుగురు పెద్ద దండనాథులను చెఱపట్టి విజ యనగరమునకుఁ బంపెను తరువాత రాయఁడు ప్రతాప రుద్రగజపతిని తఱుముచు జమ్మలోయ, కోనసీమ, కోరాము, రాజమహేంద్రవరము, వశపఱుచుకొని విశాఖపట్టణమండలమునందలి పొట్టునూరికడ జయస్తం భము నాఁటి, వడ్డాది అను సంస్థానమును జయించి సింహాచలము చేరెను. అచ్చట దేవుని సేవించి జయ

స్తంభము వేయించి కటకమునకుఁ బోయి యాపట్టణ
మును గాల్చి విజయనగరము చేటికొనియెను.

ఒకనాఁ డాతఁడు కొలువుకూటమున కొలువు దీటి
చెఱపెట్టి తెచ్చిన గజపతి పుత్రునిఁ బిలిపించి ఖడ్గకౌశ
లము చూపు మని కోరెను; గాని యాతఁ డది పరాభ
వముగా భావించి పొడుచుకొని చనిపోయెను. పిదప
గజపతికిని రాయనికిని సంధి జరిగెను. గజపతి తన
కూఁతును రాయని కిచ్చి పెండ్లి చేసెను. రాయఁడు తా
నాక్రమించుకొనిన గజపతి రాజ్యమంతయు గజపతి
కిచ్చివేసెను.

ఇది యైన తరువాత కృష్ణరాయఁడు రాయచూరు
దుర్గమును జయింపఁ దలఁచెను. ఈ దుర్గము కృష్ణకును,
తుంగభద్రకును నడుమ నుండెను. ఇది మొదట విజ
యనగర రాజులదే; గాని యనేకయుద్ధములు జరిగిన
పిదప నది తురకల పాలయ్యెను. అది జయించినఁ గాని
రాయఁడు తన పౌరుషమునకు వన్నె లేదని భావించెను.
గాని రాయనికిని, రాచూరుదుర్గమునకు ఏలిక యగు
ఆదిల్‌షాహాకును చాల స్నేహము ఉండెను. ఇఁక

యుద్ధము చేయు టెట్లు?

ఇది యిట్లుండఁగా సయ్యదుమర్కార్ అను తుర్క-
వాఁ డొకఁడు గుఱ్ఱములు తెచ్చెదనని చెప్పి నమ్మించి
రాయనియొద్దనుండి కొంత ద్రవ్యము పుచ్చుకొని ఆదిల్
షాహా రాజ్యములో దాగెను. వానిని తనకు స్వాధీన
పఱుపవలసినదని రాయఁడు వార్త నంపఁగా సయ్యదు
మర్కార్ తురుష్కుఁడగుటచే ఆదిల్‌షాహా వాని
నెచ్చటికో పంపివేసి నా దేశములో లేఁడని ప్రత్యు
త్తర మంపెను. ఈ కారణమును జెప్పి కృష్ణరాయఁడు
రాచూరుదండయాత్రకు బయలువెడలెను.

విల్లునమ్ములు తాల్చిన వారును, విచ్చుకత్తులు
పట్టిన వారును, తుపాకులు చేతఁ బట్టిన సిపాయిలును,
ఈటెలు గైకొన్న వారును గలిసి ముప్పదివేల కాల్బ
లమును, వేయి గుఱ్ఱములును, పదునా ఱేనుంగులును,
గల సేనతో సేనాధిపతులలో ముఖ్యుఁడగు కామా
నాయకుఁడు ముందునడుచుచుండెను. ఏఁబదివేల కాల్బ
లమును, రెండువేల గుఱ్ఱములును, ఇరువది యేనుం
గులునుగల సైన్యముతో నాతని వెనుక త్ర్యంబకరా

వను సేనాని పోవుచుండెను. అఱువది వేలకాల్బలమును, ముప్పది యైదు వందల గుఱ్ఱములును, ముప్పది యేనుంగులును గల ఫౌజుతో తిమ్మప్పనాయకుఁ డను నాతఁడు త్ర్యంబకరావు వెనుక నరుగుచుండెను. లక్ష కాల్బలమును, అయిదువేల గుఱ్ఱములును, ఏఁబది యేనుఁగులును, గల దండుతో నాతని వెనుక ఆదెప్పనాయకుఁ డను నాతఁడు నడుచుచుండెను. నూట యిరువది వేల కాల్బలమును, ఆఱువేల గుఱ్ఱములును, అఱువ దేనుఁగులునుగల దళముతో నాతనివెనుక కొండారెడ్డి పోవుచుండెను. ఎనుబదివేల కాల్బలమును, రెండువేల యేఁబది గుఱ్ఱములును, నలువది యేనుంగులును గల సైన్యముతో నాతని వెనుక నతని కుమారుఁడు చనుచుండెను. ముప్పదివేల కాలిబంటులును, పది యేనుఁగులును, వేయి గుఱ్ఱములును గల సేనతో విజయనగర రక్షకుఁడును, తిమ్మరుసు తమ్ముఁడు నగు సాళువ గోవిందరాజు పిమ్మట నరుగుచుండెను. పదునైదు వేల కాల్బలమును, రెండువందల గుఱ్ఱములును గల సేనతో రాయనికి తమలము అందిచు, మధురనాయకుఁ

డొక్కఁడాతరువాత వెళ్లుచుండెను. ఎనిమిదివేల కాల్బలమును, నాలుగువందల గుఱ్ఱములును ఇరువది యేనుఁగులును గల సైన్యముతో రాయనికి కూఁతు నిచ్చిన వాఁడును, మైసూరుమండలమునకు ఏలికయు నగు కుమారవీరయ్య ( కుమారవీరశ్యామరాయఁడు ) ఆతని వెనుకఁ జనుచుండెను. తరువాత వెంగాపురపు కోటకు అధిపతియు, నరపతివంశములోని ఉత్తమక్షత్రియులు మొదలగు వారును, చాల దండుతోఁ బోవుచుండిరి. నలుబది వేల కాల్బలమును, వేయి గుఱ్ఱములును, పదునైదేనుఁగులును గల సేనతో రాయఁడు ప్రేమించు మహాప్రధానులు సాళువ గోవిందరాజు వెనుక పోవుచుండిరి. నలువది వేల కాల్బలమును, ఆఱువేల గుఱ్ఱములను, మూఁడువందల యేనుఁగులను, తనచుట్టు నుంచుకొని శ్రీకృష్ణరాయచక్రవర్తి పై సేనల కన్నిటికిని నాయకుఁడై నడిపించుకొని పోవుచుండెను.

ఈ సేన అంతయుఁ గలిసి ఏడులక్షలకు మించి యుండెను. ఈ సైనికులకు భోజనాదులను అమ్మువారును గుఱ్ఱములకు నేనుఁగులకును మందుగుండు

సామాను బండ్లను లాగుకొని పోవు ఎద్దులకును గడ్డి గుగ్గిళ్లు మున్నగు వానిని అమర్చువారును, మార్గమును బాగుచేయువారును, వేగులవారు నెందఱు గలరో లెక్కించుట కెవరికిని అయినగాదు.

బ్రహ్మాండమైన యిట్టి సైన్యముతో బయలుదేరి కృష్ణరాయఁడు రాచూరుకోటను ముట్టడించెను. కోటలోని వారు చాల స్వల్పముగనే యున్నను వెంటనే తలుపులు మూసివైచి బురుజుమీఁది ఫిరంగీలను సిద్ధపఱచి ధైర్యముతో పోరసాగిరి.

కృష్ణరాయఁ డిట్లఖండ సైన్యముతో వచ్చి రాచూరు ముట్టడించె నని విని ఆదిల్ షాహ పెద్దసైన్యముతో వచ్చెను. ఇద్దఱును కొంతతడవు కృష్ణకీవల నొకరును, ఆవల నొకరు నుండిరి గాని తుదకు ఆదిల్ షాహ ఏరుదాఁటిపోయి రాయని సైన్యముతో యుద్ధము ప్రారంభించెను. ఈ యుద్ధము చాల ఘోరముగ జరిగెను. తుదకు తురక లోడిపోయిరి. ఆదిల్ షాహ యేనుఁగు నెక్కి కృష్ణ దాఁటి పాఱిపోయెను. తురకసైనికు లనేకు లనేకవిధములఁ జచ్చిరి. రాయఁడు

శత్రుసైన్యమును నిరభ్యంతరముగా దోఁచుకొనియెను.

ఆదిల్‌షాహా నిట్లు పాఱఁదోలి రాయఁడు తిరిగి వచ్చి రాచూరు ముట్టడించి యిరువది దినములు పోరి దానిని స్వాధీనము చేసికొనియెను. కోటలో ఎదురుకొనిన వారి నందఱను జంపించెను. పోయెద మన్న వారిని పోనిచ్చెను. శరణన్న వారిని రక్షించెను. పిదప రాయఁడు కొంత సేనను రాచూరుకోటలో నుంచి తక్కిన సేనను వెంటఁబెట్టుకొని మహావైభవముతో విజయనగరమునకుఁ బోయి సైనికులకును సేనాధిపతులకును గొప్ప గొప్ప బహుమానములు చేసెను.

పిదప ఆదిల్‌షాహా తాను తప్పు చేసితి ననియు, అనుగ్రహించి తన రాచూరుకోటను తిరిగి తనకు దయ చేయవలసిన దనియు ప్రార్థించుచు రాయని కడ కొక సరదారు నంపెను. ఆదిల్‌షాహా వచ్చి మా కాళ్ళు పట్టుకొని బతిమాలినచో నట్లే యిచ్చెద నని రాయఁడు ప్రత్యుత్తరము చెప్పెను. ఆదిల్‌షాహా అందుల కంగీకరించెను; గాని అన్న నాఁ డేర్పఱచికొనిన చోటికి రాకపోవుటచే రాయఁడు కోపించి ఆదిల్‌షాహా రాజ్య

ముమ్మాఱుదఁ బడి దాని ననేకవిధముల పాడుచేసి రాజధానియగు విజాపురమును దోఁచించి ఆపైని మంత్రులు పోవలదని సలహా చెప్పుటవలన వెనుకకు మరలి విజయనగరము చేరికొనియెను.

ఈ దాడిలో రాయఁడు కలుబరగి దుర్గమును గూడ ఆక్రమించుకొనియెను. ఆదమ ములో నాదిల్ షాహా బహామనీరాజవంశమునందలి ముగ్గురిని చెఱలో నుంచెను. కృష్ణరాయఁడు వారిని చెఱ విడిపించి పెద్దవానికి రాజ్యము కట్టెను. మిగిలిన యిద్దఱను తన వెంటఁ దీసికొనిపోయి పెద్ద యుద్యోగము లిచ్చెను.

ఇట్లనేకరాజులను జయించి మించుటచే కృష్ణరాయఁడనిన నెల్లరును గడగడ లాడుచుండిరి. అందఱు నాతనిని చక్రవర్తి యని పూజింప సాగిరి. ఈ వైభవమంతయు నాతనికి తిమ్మరుసు సాహాయ్యంబుననే గలిగెను.

రాయఁడు గొప్ప రసికుఁడు; గొప్ప విద్వాంసుఁడు. ఈతఁడు విష్ణుచిత్తీయ మను మాఱు పేరుగల ఆముక్తమాల్యద అను గొప్ప కావ్యమును రచించెను. ఇతని

యాస్థానములో సంస్కృతము, ఆంధ్రము, కర్ణాటకము అను మూఁడు భాషలలో చక్కని కవిత్వము చెప్పఁగల కవు లనేకు లుండిరి. అల్లసాని పెద్దన్న, నంది తిమ్మన్న, అయ్యలరాజు రామభద్రుఁడు, కవిధూర్జటి, మాదయగారి మల్లన్న, పింగళి సూరన్న, రామరాజభూషణుఁ డను భట్టుమూర్తి, తెనాలి రామలింగకవి, అను వారు తెలుఁగు కవులు. వీరందఱు నొకరి కొకరు తీసిపోని పండితశేఖరులు. వీరిలోఁ గొందఱు గొప్ప కావ్యములను వ్రాసి రాయని కంకితము చేసిరి. వీరు గాక తిమ్మణ్ణార్యుఁ డను కవి కర్ణాటకభాషలో భారతము వ్రాసి రాయనికిఁ గృతి యిచ్చెను. రాయఁడు సంస్కృతభాషలోఁ గూడ కొన్ని కావ్యములు వ్రాసెను. రాయఁడు పండితులను చాల గౌరవించెను. మనుచరిత్ర కృతి పుచ్చుకొనునపుడు రాయఁడు అల్లసాని పెద్దన్నను పల్లకిలో నూరేగింప పల్లకి తన చేతితో నెత్తెను.

రాయఁ డనేకము లగు కాలువలను చెఱువులను త్రవ్వించి వ్యవసాయమునకు చాల సౌకర్యములు గలి

గించెను. కొన్ని చోట్ల నదులకు ఆనకట్టలు గూడ గట్టించెను. ఇంద్రుని మందిరములను నవ్వఁగల చక్కని మందిరముల ననేకములు గట్టించెను. గొప్ప దేవాలయములను గోపురములను గట్టించెను. పూర్వులు కట్టిన వన్నియు బాగుచేయించెను.

రాయఁడు ప్రతిదినమును చాలసేపు సాము చేయుచుండెను. ఆతఁడొడలినిండ నూనె రాసికొని అది శరీరమున ఇంకిపోవువఱకును కత్తి సాము చేయుచుండెను. విలువిద్యయందును, కుస్తీపట్టుటయందును, ఖడ్గము విసరుటయందును, గుఱ్ఱము స్వారి చేయుట యందును రాయనితో నెవ్వరును సములు లేరైరి.

రాయనికి చిన్నాదేవి, అన్నపూర్ణాదేవి, తిరుమలదేవి అను ముగ్గురు భార్య లుండిరి. రాయని కొక కుమారుఁడు ఉండెను. రాయఁడు తిరుమలాంబిక అను నొక కుమార్తెను నరపతివంశజుఁడైన రామరాజునకును, వెంగళాంబిక యను మఱియొక కూఁతును రామరాజు తమ్ముఁడగు తిరుమలరాజునకును ఇచ్చి పెండ్లి చేసెను.

కృష్ణరాయఁడు తుదకు ఆ తేండ్లవాఁ డగు తన కొడుకునకు పట్టము గట్టి తాను మంత్రిగను, తిమ్మరుసు కార్యదర్శిగను, తిమ్మరుసు కొడుకు దండనాయకుఁడుగను, ఏర్పఱిచి రాజ్యము పాలింపఁ దొడఁగెను; గాని యెనిమిది నెలలయిన తరువాత ఆ పిల్లవాఁ డేదో కారణమున చనిపోయెను. తిమ్మరుసు కొడుకు విషము పెట్టి తన కొడుకును జంపె నని సందేహించి రాయఁడు తన్ను కుమారునివలె పెంచిన తిమ్మరుసును, ఆతని తమ్మునిని, కుమారుని చెఱబెట్టించెను. తిమ్మరుసు కొడుకు తప్పించుకొనిపోయి రాయనిపై దండెత్తెను. రాయఁ డాతనితోఁ బోరి పట్టుకొనెను. పిదప తిమ్మరుసు యొక్కయు, ఆతని కుమారుని యొక్కయు, తమ్ముని యొక్కయు గ్రుడ్లు పీకించి కైదు చేసెను. తిమ్మరుసు కైదులోనే చనిపోయెను. ఇట్టి క్రూరకృత్యము చేసినందులకై రాయని నెల్లరును నిందించిరి.

విజయనగరములో ఇట్లు అంతఃకలహములు ప్రబలుటఁ జూచి ఆదిల్‌షాహా రాచూరు ముట్టడింప బయలుదేఱెను. ఆ వార్త విని రాయఁడు వెంటనే గుఱ్ఱము

నెక్కి చాల కోపముతో రాచూరుదెసకు పోసాగెను. సైన్యమాతని వెంట బయలుదేరెను. ఆదిల్‌షాహా రాయని కోపమును విని వెనుకకు పాఱిపోయెను. పిదప రాయఁడు "నీవు చేసిన తప్పిదమునకు నీ పీఁచమణఁచెద" నని ఆదిల్‌షాహాకు కబురుపంపి యుద్ధప్రయత్నములు చేయసాగెను; గాని యింతలో దైవయోగమువలన రాయఁడు చనిపోయెను.

---

## అచ్యుతదేవరాయఁడు

---

కృష్ణరాయఁడు చనిపోయిన పిదప చంద్రగిరి కోటలో కైదుచేయఁబడిన ఆతని తమ్ముఁడగు అచ్యుతదేవరాయఁడు రాజయ్యెను. ఈతఁడు చాల పిఱికివాఁడు ఈతఁడు మంత్రులు చెప్పు మాటలను వినుట మానివేసి బావమఱఁదుల మాటలు విన సాగెను. ఆ హేతువుచే నీతనికిని మంత్రులకును వైర మయ్యెను. ఈ సంగతి విని ఆదిల్‌షాహా విజయనగరముమీఁదికి దండెత్తివచ్చెను. సైనికులెంత ప్రార్థించి

నను అచ్యుతరాయఁడు యుద్ధమునకు సెలవీయఁ డయ్యెను. తుర్కీవాండ్రు చాల చక్కని దగు నాగలాపురమును ధ్వంసము చేసినను ఈతఁ డేమియు ననక, సైనికులు వలదు వల దని చెప్పుచున్నను వినక నవాబునకు రాచూరు, ముద్గల్లు అను దుర్గములును కొంత ధనమును ఇచ్చి సంధిచేసికొనియెను.

పిదప నీతఁడు నవాబున కిచ్చిన ధన మంతయు ప్రజలమీఁద పన్నులు వేసి రాఁబట్టుకొనసాగెను. ఈ దుష్కృత్యమువలన ప్రజల కీతనియందు భక్తివిశ్వాసములు పోయెను. ఈతఁడు చాల వైభవము లనుభవించెను. ఈతని అంతఃపురములో వాడఁబడు పాత్రలన్నియు బంగారముతోఁ జేయఁబడెను. ఈతనికి అయిదువందల భార్యలుండిరి. అంతఃపురమునకు సంబంధించిన సేవకు లేఁబదివే లుండిరి. మొత్తము మీఁద నీతఁడు విజయనగర సామ్రాజ్యగౌరవమును పాడుచేసెను. రాజ్యమును స్వాయముగ పాలింపలేక విభజించి సరదారులకు అప్పజెప్పెను.

---

## సదాశివరాయఁడు



అచ్యుతరాయఁడు చనిపోయిన పిదప ఆతని కుమారుఁడగు వేంకటరాయఁడు రాజయ్యెను. ఈతఁడు బాలుఁడు. మంత్రులు రెండు భాగములుగా విడిపోయిరి. అందు సలకము తిమ్మయ యొక ప్రక్కను, కృష్ణరాయని అల్లుఁడగు రామరాజు ఒక ప్రక్కను వ్యవహారములు నడుపుటకుఁ బ్రయత్నించిరి; గాని రామరాజు పక్షము బలము లేనందున నాతఁడు చేయునది లేక తనజాగీరునకు పోయెను. పిదప సలకము తిమ్మయ బాలరాజును జంపి తానే రాజయ్యెను. అందుల కంగీకరింపక తక్కిన మంత్రులందఱును తిరుగఁబడి రామరాజును రప్పించిరి. అంత సలకము తిమ్మయ భయపడి ఏమియు చేయలేక ఆడిల్‌షాహాను రప్పించి నీకు సామంతుఁడ నయ్యెద నని చెప్పి వానిని విజయనగరసింహాసనముమీఁద నెక్కించెను. అంత కార్యము చెడె నని భావించి రామరాజు మున్నగు వారు సలకము తిమ్మయ వద్దకుఁ బోయి " నీవు చెప్పినట్లు వినెదము. నవాబును

రాజు అను అయిదుగురు పుత్రులు పుట్టిరి. వారు గూడ తండ్రివలెనే గొప్ప వీరులు. ఇద్దఱు తమ్ముల యొక్కయు, అయిదుగురుకుమారుల యొక్కయు సాయమువలన రామరాజు దక్షిణదేశము నందలి నవాబులను దిద్దిమ్మని నాట్య మాడించివేసెను.

విజయనగరమున కుత్తరమున విజాపురము, అహమ్మదనగరము, గోలకొండ, బేదరు, అను నాలుగు తురకరాజ్యము లుండెను. మొదట రామరాజు అహమ్మదనగరగోలకొండనవాబులతోఁ గలిసి విజాపుర రాజ్యమునందలి కొన్ని కోటలు గెలిసి దాని యేలిక యగు ఆదిల్‌షాహాను గడగడలాడించెను. అక్కాతన చేయునది లేక ఆదిల్‌షాహా రామరాజుతోడను అహమ్మదనగర నవాబుతోడను సంధి చేసికొనియెను. మఱి యొకపుడు రామరాజు అహమ్మదనగరనవాబును ప్రేరేపించి విజాపురముమీఁదికి యుద్ధమునకు పంపెను; గాని అతఁడు ఓడిపోయి తిరిగి వచ్చెను. రామరాజు ఈ దేశములో ప్రబలుచున్న పోర్చు సువారితో సంధి చేసికొనియెను. పిదప నొకపుడు అహమ్మదనగరనవాబు

రామరాజునకు రత్నములు కానుకలు నంపెను. ఈ సంగతి విని విజాపురనవాబు తన సభలో నున్న విజయనగర రాయబారులను చాల నగౌరవపఱిచెను. వెంటనే రామరాజు కోపోద్దీపితుండై తన సైన్యమును సాయమిచ్చి అహమ్మదనగరనవాబును విజాపుర నవాబుమీఁదికి యుద్ధమునకుఁ బంపెను. అప్పుడు విజాపురనవాబు అహమ్మదనగరనవాబుకోటలలో నొకదానిని స్వాధీనము చేసికొనఁగా అహమ్మదనగరనవాబగు నిజాముషాహాతోఁ గలసి రామరాజు విజాపురరాజ్యములోని రాయచూరు ముద్గల్లు దుర్గములను కృష్ణా తుంగభద్రానదుల మధ్య నున్న ఫలవంతమైన దేశము నాక్రమించుకొనియెను.

పిదప అహమ్మదనగరనవాబగు బుర్హాన్ నిజాముషాహా చనిపోయెను. ఆతని తరువాత అహమ్మదనగరమునకు హుసేన్ నిజాముషాహా నవాబయ్యెను. కొంతకాలము వఱకు హుసేన్ నిజాముషాహాయును, ఆదిల్‌షాహాయును స్నేహముగా నుండిరి; కాని ఆదిల్‌షాహా రామరాజు సాయము పొంది నిజాముషాహాతోఁ

పోరి షోలాపురమువద్ద నోడిపోయెను. పిదప కొన్ని దినముల కాతఁడు చనిపోయెను. అప్పుడాతని పెద్దకొడు కగు అలీఆదిల్ షాహా నవా బయ్యెను. ఈతఁడు తండ్రి బ్రతికియున్నపుడు పోయిన రాజ్య మంతయు తిరిగి రాఁబట్టుకోవలె నని మనస్సులో నిశ్చయించుకొనియెను. ఇంతలో రామరాజు కొడుకు కొకఁడు చనిపోయెను. ఇదే సమయ మని అలీఆదిల్ షాహా రామరాజును జూడ బోయి నన్ను నీ కొమారుఁడుగా తలంచి కొమ్మని చెప్పెను. రామరాజును ఆతఁడును తండ్రియు కొడుకుల వావితో పిలుచుకొనుచుండిరి.

అలీఆదిల్ షాహా విజాపురము చేరిన వెంటనే తన పూర్వులను త్రోసివేసి ఆక్రమించుకొనిన కల్యాణీ షోలా పురములను తిరిగి యిచ్చివేయవలసిన దని అహమ్మదనగర నవాబునకు వార్త నంపెను. నిజాముషాహా ఆవార్త తెచ్చిన వానిని మిక్కిలి అగౌరవపఱుపఁగా రామరాజును, అలీఆదిల్ షాహాయుఁ గలిసి అహమ్మదనగరరాజ్యముమీఁద బడి దేశ మంతయు పాడుచేసిరి. రామరాజు సైనికులు తమను తుర్కీవాండ్ర

పైఁ గల కసి యంతయు తీర్చి కొనిరి. తురకలు భార తీయస్త్రీలను ఎట్లు అగౌరవపఱిచిరో అట్లే వారు తుర్క స్త్రీలను అగౌరవపఱిచిరి. మసీదు లన్నియు పడగొట్టి దేవాలయములు గట్టించిరి. తుదకు నిజాముషాహా రామరాజుతోను అలీ ఆదల్‌షాహా తోను సంధి చేసికొనెను.

కాని నిజాముషాహా కల్యాణ దుర్గమును వదలి యుండలేక వెంటనే గోలకొండనవాబుతో సంధి చేసి కొని ఆ కోటను బట్టుటకు దండెత్తి పోయెను. అదివిని రామరాజును అలీఆదిల్‌షాహాయు వారి నెదిరించిరి. ఈ తడవ రామరాజువెంట ఏఁబది వేల గుఱ్ఱములును లెక్కలేనంత కాల్బలము నుండెను. దానినిఁ జూచి భయపడి గోలకొండనవాబు రామరాజుతోఁ గలిసెను. పిదప నీ ముగ్గురును గలిసి అహమ్మదనగరనవా బగు నిజాముషాహాను తఱిమివేసిరి. ఆతఁడు తన రాజ ధానికి పాఱిపోయెను.

పిదప గోలకొండనవాబును, విజాపుర నవాబును రామరాజును గలిసి అహమ్మదనగరమును ముట్టడించిరి;

గాని గోలకొండనవాబు నిజాముషాహకు కొంచెము సాయము చేసెను. ఆ కారణముచే నిజాముషాహ లొంగక పోయెను. వర్షకాలము వచ్చుటచే ఎక్కడివా రక్కడకు పోయిరి. ఈతడవగూడ విజయనగరసైనికులు తురకల ననేకవిధముల బాధించిరి. అది చూచి నిజాముషాహయే గాక, గోల్కొండ, విజాపురనవాబులు గూడ రామరాజుపై మనస్సులో చాల కోపము వహించిరి.

ఇట్లు ఎన్ని విధములఁ జూచినను తురకలు తనకు లొంగియే యుండుటవలన రామరాజునకు గర్వము హెచ్చెను. వారి నాతఁ డనేకవిధముల నగౌరవపఱుపఁ జొచ్చెను. ఆ హేతువుచే తురకనవాబు లందఱును ఏకమైరి. వారిలో వారు మజిల వివాదపడకుండ ఒకరి పిల్లల నొకరు పెండ్లాడిరి. పిదప ముగ్గురును గలిసి రామరాజుమీఁదికి దండెత్తి వచ్చిరి. రామరా జది విని వారి కెదురుగఁ బోయెను.

రామరాజు ఈ ఘోరయుగములో అద్భుతముగా పోరిన సైనికులకు బహుమతు లిచ్చుటకై రత్నములు

రూపాయలు, వరహాలు మున్నగు నవి పళ్లెరములలో నుంచి చుట్టను బెట్టుకొనియెను; గాని యొకప్పు డాతఁడే యుద్ధము చేయవలసివచ్చెను. ఆ కారణముచే వెంటనే యాతఁడు మేనా యెక్కి బయలుదేఱెను. అప్పు డొక యేనుఁగు బెదరివచ్చి పల్లకిపైఁ బడెను. బోయీలు పల్లకి విడిచి పాఱిపోయిరి. వెంటనే రామరాజు లేచి గుఱ్ఱ మెక్కఁబోవగా అహమ్మదనగరసైనికు లాతనిని బట్టుకొని తమ యేలిక చెంతకుఁ దీసికొనిపోయిరి. వెంటనే నిజాముషాహ రామరాజు శిరస్సు తునిమి దానిని బల్లెమునకు గ్రుచ్చి విజయనగరసైనికులకుఁ చూపించెను. ఇది చూచి విజయనగరసైనికులు ధైర్యము గోలుపోయి పాఱిపోయిరి. తుర్కవాండ్రు చే కందినంతమట్టుకు సంహరించివేసిరి. విజయనగరము తురకల పాలయ్యెను. ఆఱుమాసములు తురకలు దోఁచుకొనియు, ఇండ్లు తగులఁబెట్టియు పెద్ద పెద్ద మేడలను, దేవాలయములను కూల్చియు, ఆఁడువాండ్రను చెఱిచియు, పిల్లలను తెగనఱికియు, పెద్దలను నానాబాధలు పెట్టి చంపియు నిట్లు పట్టణమును ధ్వంస

ము చేసిరి. ఈయుద్ధములో రామరాజు తమ్ముఁడగు తిరుమలరాజు సదాశివరాయనినిఁ దీసికొని పెనుగొండకు పాఱిపోయెను. అక్కడ తిరుమలరాజు సదాశివరాయనినిఁ జంపి తానే రాజాయెను. ఆతఁడు విజయనగరమును బాగుచేయవలయు నని ప్రయత్నించెను; గాని లాభము లేదయ్యెను.

తిరుమలరాజు వంశములోని వారు కొన్ని యేండ్లవఱకు చంద్రగిరిలో పరిపాలనము చేసిరి. ఈతని వంశములోని వాఁడగు ఆఱవ ( )రంగరాయఁడు ఇంగ్లీషువారికి చెన్నపట్టణములో కోట కట్టుకొనుటకు సెలవు ఇచ్చెను. ఆ వంశమునందు జన్మించిన శ్రీ రాజా శ్రీరంగదేవరాయలవారిపుడు ఆనెగొందిలో రాజ్యము చేయుచున్నారు. ఆనెగొంది నైజాము రాజ్యములో నున్నది.

శ్రీ వేంకీ ముద్రాక్షరశాల — రాయవరము. 1916